# అనుక్రమణిక

# హృదయ కమలం

నరుని ఉరములోని నవ హృదయం
పరమేశ్వరుని పాణింధమం ;
సృష్టించే సమయాన దైవం కుమ్మరి,
సృష్టించిన తరువాత అతడే కమ్మరి ;

గుండె అనే ఈ కొలిమి
మండుతుంటేనే బలిమి ;

ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
సంకోచ వ్యాకోచాలు,
జననం నుంచి మరణం వరకు
జనులు జీవించడం కొరకు ;

సుఖంలో దుఃఖంలో
సుషుప్తిలో జాగృతిలో
ఉషలో నిశలో
నడకలో పడకలో
గడబిడ చేయని దడదడ
తడబడ బోనిది ఆ నడ ;

నిమిషం ఆగని కళ పెళ
నిలుపును మన కన్నులలో తళతళ

విరిసిన కమలం హృదయం ;
జననం, దానికి ఉదయం ;
మరణమే సాయంసమయం ;
అప్పటి దాకా అభయం !

పుట్టుక నుండే పయనం
గిట్టిన నాడే శయనం ;
ఈ దేహం దేవాలయం
ఈ గుడిలో దీపం హృదయం ;
మండే ప్రాణం జ్వాల
గుండెకు తేజోమాల

రుధిర గంగ కది హిమాలయం
కరుణా గౌరికి శివాలయం ;
కవి కలాన్ని కదపాలన్నా
కృషికుడు హలాన్ని నడపాలన్నా
లయతప్పక నర్తకి నాట్యం చేయాలన్నా
శ్రుతి తప్పక గాయని గానం చేయాలన్నా
ఎముకల సీకుల గదిలో మెదిలే
హృదయం చలనం వున్నన్నాళ్ళే :

మానవ మేధాశక్తికి అందని
మహా విచిత్రం మానవ హృదయం

నిలవకు హృదయం ! నీకు వందనం !
నీదీ నాదీ రుధిర బంధనం !

ప్రేయసీ ప్రియుల తీయని ప్రణయం
మహాకవులలో మంజుల కవనం
సేనా వాహిని చేసే కదనం
వీటికి ప్రాణం నీ సంచలనం

మా పై అలగకు, అపుడే ఆగకు
మంచి పనులను మధ్యన ఆపకు ;
నవ మోహనమై నా వాహనమై
ఉరగము కంటే తురగము కంటే
అనలము కంటే పవనము కంటే
వేడిగ వాడిగ వెళ్ళెదవు
చతురస్రంలో సాగెదవు
కాలపథంలో కదలెదవు
అలసట యెరుగక మెదలెదవు

గమ్యం చేర్చుట నీ ధర్మం;
కాదంటావా మా కర్మం !

మనిషి మనిషిలో నీవుండాలి
కనికరమన్నది కలిగించాలి ;
హృదయం లేనిది మనిషే కాదు
ఉదయం లేనిది పగలే కాదు

నశ్వరమైనది నర జీవితము
శాశ్వతమైనది సత్కవిత్వము

సత్కవిత్వమును సాధించుటకు
నీ తోడ్పాటే మా వాంఛితము

నీ రుధిరంలో నా బ్రతుకున్నది
నా అధరంలో నీ పిలుపున్నది

నేస్తం! నీవే నాకు సమస్తం
నీ చలనం నా నవ్య కవిత్వం

జీవన సవనపు హోతవు నీవే
జీవుల పాలిటి నేతవు నీవే

రుధిర సరసిలో విరియు కమలమా!
సుధలందించే మధుర హృదయమా!
ఆగకు ఆగకు! అతిగా వాగకు!
సాగు సమయమున ఇటు అటు ఊగకు

# న వో ష స్వి ని

ఒక నిద్రాణ జగమ్ము మేలుకొని నేడుత్ఫుల్లమై తోచె; సూ
ర్య కర స్పర్శకు విచ్చుకొన్నయవి స్వచ్ఛాంభోరుహ శ్రీసుమ
ప్రకరమ్ముల్- రమ నిండుకొల్వులు; హరిద్రా స్వర్ణవర్ణమ్ములన్
కకుబంతమ్ములు మంగళ ప్రదములై కల్పించె నుల్లాసమున్

భయము లేక చెట్లపై కొమ్మలందలి
గూండ్లలో శయించి క్రొత్త వెలుగు
రేక తాకగానె చీకటి గూండ్లలో
కనులు తెరచి చూచె ఖగ చయమ్ము

అలసటలేక రేబవలు యానమొనర్చు నదీప్రవాహ వీ
చులు పవనాంకురాహతికి సోలుచు తీరముదాక చేరి ఆ
వల జలధారలో గలియు; ప్రాణము తజ్జల ధార; ప్రాణి కో
టులు తరగల్ ; జనించుటయు డుల్లుట బాహిర కల్పనావళుల్

ఈశా ! విశ్వవిశాల మందిరము నీ వేలాగు నిర్మించి నా
వో ? శార్దూలములందు చంపకములం దొప్పారి చెప్పంగరే సు
ఆశాంతమ్ముల భాసుబింబము అసలో ద్యానమ్మటుల్ తోచు, భూ
దేశం బా వని నుండి వ్రాలిన హసంతీ సూనమై కన్పడున్

అణువంత తెలియు మనిషికి;
అణువున నస్త్రమ్ముజేసి అంతకుడాయెన్,
మనిషికి సకలము తెలిసిన
మన బ్రహ్మాండమ్ము నెల్ల మాయించడొకో !

మంచి మరచి పోయి వంచన కోరిన
అతని చదువు జగతి కపకరించు ;
జగతి కుపకరించు చదువులే చదువులు ;
మంచిలేని మనిషి మనిషి కాడు

దానవ దంష్ట్రికా విష విదగ్ధము భూవలయమ్ము : దీనికిన్
ప్రాణము వోయు శక్తిగల వైద్యునకై వెదకాడు చుంటి; ప్రా
మాణికమైన యౌషధము మానవతా సుధ యొక్కటే; పరి
త్రాణము గల్గు ప్రాణులకు దాని నిషేవణ మాచరించినన్.

# సౌజన్య పర్జన్యం

మూర్ఖత్వం మానవుడితో
ముష్టి యుద్ధం చేస్తున్న వేళ—

డొక్కలో గుద్ది, ముక్కు బద్దలుకొట్టి
ఒక్క మనిషిని ఓడించు వేళ —

జీవుడికి తిండి దొరకని రోజుల్లో
దేవుడు అజీర్ణంతో బాధపడే వేళ —

పట్టు చేలాలతో స్వాములవారు
ప్రజల్ని 'భస్మం' చేస్తున్న వేళ —

కులం - తళతళ మెరిసే కరవాలమై
బలంలేని వాళ్ళను నరుకుతున్న వేళ —

మతం - పిచ్చెక్కిన మత్తగజంలా
మనుషుల్ని నలగ త్రొక్కుతున్న వేళ—

సర్వమానవ సమానత్వం కోసం
ఉర్విలో శాంతి సౌఖ్యాలకోసం

పోరాడుతున్న మహామానవుల్ని
"పొండిరా ! పిచ్చివాళ్ళల్లారా !" అనేవేళ

నిరాశతో క్రుంగిపోలేం మనం
కరాసితో కదలివస్తాం మనం ;

దౌర్జన్యం గర్జనచేసే జగతిలో
సౌజన్య పర్జన్యం పలికిస్తాం మనం.

# పావన శ్రావణం

మనసులో ఎగిరేది కేతనం
కనుకనే అది నిత్య నూతనం ;
ప్రజల త్యాగము పారద్రోలె
పరదేశముల వారి పెత్తనం

ఆ సేతు హైమాచలం
ఈ నాడు కోలాహలం ;
దేశాన జనులందరు
ఏకముగ ఉంటే బలం

గంగమ్మ పొంగింది నిండుగా
భూదేవి పండింది దండిగా ;
మన దేశ సంపదను పెంచుదాం
కర్షకులు కార్మికులు అండగా

వచ్చింది వచ్చింది శ్రావణం
భారత ప్రజలకేది పావనం :
నీలాల మేఘాల నీడలో
విరిసింది మనుజాతి జీవనం

# వసంత చక్రం

ఏపేటా ఒక్క రోజైనా
ఇలా ఉగాది రాకపోతే
మానవ జీవితపు ఎడారిలో
మల్లెలెలా వికసిస్తాయి ?

ఏపేటా చుట్టపు చూపుగానైనా
ఇలా వసంతం తొంగి చూడకపోతే
మోడు పడిన నరహృదయాలు
ఎలా అవుతాయి నవనందనాలు ?

చేదు బ్రతుకుల వేప కొమ్మమీద
చిలక కూర్చుని తీయగా పలకనీ !
కళ్ళకు కనపడక పోయినా, కోయిల
కడుదూరం నుంచైనా పాట వినిపించనీ !

పిల్లల్ని ఆదుకోడానికి వచ్చే తల్లిలా
పేదల్ని ఆదుకోడానికి వస్తుంది ఉగాది ;
మునుగుతున్న వాణ్ణి ఆదుకునే ఓడలా
వేదన పడే వాణ్ణి ఓదారుస్తుంది ఉగాది ;

ఈ ఉగాదే రాకుంటే ఇంకేముంది ?
ఈ పెదవులపై చిరునవ్వు ఎలా పుడుతుంది ?
ఈ ఉగాది ఇంటింటా అవతరించాలి
ఇక నిరాశ లోకంలో అంతరించాలి.

# నవ వసుంధర

రావణ వధానంతరం లంకలా
రమణీయంగా వుంది వసుంధర

ఉద్ధతులు పద్ధతులు మార్చుకున్నారు
యుద్ధాలవల్ల లాభంలేదని తెల్చుకున్నారు

పరమాణువులోని భయంకర శక్తులకు
భయపడవలసిన అవసరంలేదు మనకు

కారణం — అణ్వస్త్రాలు వివస్త్రాలై
కడుసిగ్గుతో భూగర్భంలో దాక్కున్నాయి

ఆయుధాల మీద ఖర్చుచేసే డబ్బును
అనేక విధాల సద్వినియోగం చేయవచ్చును

జబ్బును గెలవడానికి వాడండి డబ్బును
శరీరం దుమ్మెక్కిన వారికివ్వండి సబ్బును

మరచిపోండి అన్ని వాదాలు
మానవతా వాదాలే మన వేదాలు

భావి, కాదు పాడుబడిన బావి
భవిష్యత్ కాలాలు ప్రజానీకానివి

# చుక్కలు

గగనంలో చుక్కలకు
కన్నీటి చుక్కలకు
గల సంబంధం తెలుసుకోవడం
కాదు అనుకున్నంత సులభం

గగనంలో చుక్క
గాఢాంధకారంలో మెరుస్తుంది;
మార్తాండుని మహా తేజస్సులో
మరుగు పడిపోతుంది

కన్నీటి చుక్క
కడగండ్ల వడగండ్లలో మొలుస్తుంది;
నవ్వుల పువ్వుల మీద
నవహిమ బిందువులా
నిలుస్తుంది;

నిద్రా మంజూషికలో
భద్రంగా శయిస్తుంది;

శుక్తిలో గల
ముక్తాఫలం కన్న
అక్షులలో గల
అశ్రుజలం మిన్న

అందాలరాణి నయనాలు చిందే
అశ్రుబిందు బృందానికి వందే

# అగ్నిఘంట

అంధకారపు ఆలయంలో
అదిగో! మ్రోగెను అగ్ని ఘంట;
కంటకమ్ముల శయ్యపైన
కన్ను తెరచె గులాబి జంట

అగ్ని ఘంటారావమును విని
అదరిపడి మేల్కొంది లోకం;
నిదురపోయే జీవితాలకు
నేడు సుందర సుప్రభాతం

మూగపడిపోయిన గళాలకు
పొంగి వచ్చే రాగమిదిగో!
తుప్పుపట్టిన ఆ కలాలకు
నిప్పురవ్వల కవితలివిగో!

ఇది పురోగమన ప్రపంచం.
ఇక తిరోగమనం సహించం:
మిల్లుగాని, ఇల్లుగాని
డల్లుగా వుంటే భరించం!

తరుణి యెన్నడు అబల కాదని
నిరూపించే వత్సరం ఇది;
భరత మాతృ కిరీట కాంతులు
ధరణినిండే సుసమయం ఇది

జాతి అంతా శ్రమిస్తేనే
సాహసంతో చరిస్తేనే
దరిద్రాన్ని రూపుమాపి
చరిత్రను సృష్టించగలము

భవిష్యత్సౌధాగ్ర సీమను
ప్రజా చైతన్యోజ్వలముగా
సమసమాజ శ్రీ పతాకం
ఎగురవేతాం, కదలిరండి !

# స్వాప్నికుడు

పందులు విందులు చేసుకునేచోట
నందివర్ధనం పూలు పూస్తాయట !
దుర్గంధం దుర్భరంగా ఉన్నచోట
సుగంధ మారుతాలు వీస్తాయట !

రేపుమీద విశ్వాసం ఉన్న నేను
నేడు ఎలాఉన్నా భరిస్తాను !
మురికి కాలువప్రక్కన కూర్చున్న నేను
సురనదీ పరిసరాలను ఊహిస్తాను !

కుట్రల, కృత్రిమాల ఉక్కు చట్రం
కూలి ముక్కచెక్కలౌతుందని నమ్ముతున్నాను;
సత్య, దయా, శాంతాల ధర్మచక్రం
నిత్యం పరిభ్రమిస్తుందని విశ్వసిస్తున్నాను.

గొంగళీ పురుగులా వికారమైన పేదలు
రంగుల సీతాకోక చిలకల్లా వికసిస్తారు;
కలం బలంతో జీవించాలనుకున్నవారు
కల నిజమయ్యే రోజులు చూస్తారు

# గగనంలో కరచాలనం

దహరాకాశపు రహదారులలో
విహారించాయి సోయుజ్ అపోలో!
కలిపాయీ అవి చేయీ చేయీ.
ఇలపై అంతా భాయీ! భాయీ!!

లక్షలమందిని కుక్షిన దాచే
రాక్షస రణ మిక రాదనుకుందాం;
అణ్వస్త్రాల విజృంభణమంతా
అంతరించునని భావింతాం

విజ్ఞానం ఇక విశ్వశాంతికే
వినియోగించుట కర్తవ్యం;
అండ, పిండ, బ్రహ్మాండమంతటా
ఉండబోదు ఇక దౌర్జన్యం

వానలు లేవని వగచేవారికి
వర్షం తెస్తే విజ్ఞానం;
పొట్టకు గడవని పేదజనాలను
పోరాడిస్తే అజ్ఞానం!

వ్యాధిపీడితుల, మృత్యువునుండి
బ్రతికిస్తే అది విజ్ఞానం;
ప్రళయకాళికకు అమాయకులను
బలిచేస్తే అది అజ్ఞానం

బళ్ళూ, ఇళ్ళూ, గుళ్ళూ, రైళ్ళూ
ప్రభవించడమే విజ్ఞానం
ఐ.సీ.బీ.ఎమ్. హైడ్రోజన్ బాంబ్
రాసులుపోయుట అజ్ఞానం

తగ్గించాలీ ఆర్మీ బడ్జెట్
సాధించాలీ ప్లానింగ్ టార్గెట్,
మృత్యురంగమును మూసేయాలి !
నృత్యరంగమును తెరిచేయాలి !

# వజ్రపద్మం

వికసించిన ఈ పద్మం
ఇక యెన్నడూ ముకుళించదు;
తెరచుకున్న ఈ సద్మం
ఇక యెన్నడూ మూసుకోదు

అందుకే ఇది వజ్రపద్మం
దీని మారు పేరు ధీర హృదయం ;
ఇందులో తలదాచుకోదలచిన
యెందరికైనా చోటుంటుంది

ఇది శత్రుదుర్భేద్యమైన కోట
ఇది శిశిరాలు యెరుగని తోట;
ఇట నిత్యవసంతం నృత్యం చేస్తుంది
ఇట ముక్తాహారంలా దయాశ్రుధార మెరుస్తుంది

ఇది దుష్టుడికి కఠినాతి కఠినం
ఇది ఇష్టుడికి అత్యంత మృదులం
ఈ జగం మానవ మహాకాసారం
ఈ హృదయ వజ్రపద్మం దీనికి అలంకారం.

# కాలం వేసిన గాలం

నీ కాళ్ళతో
నా కళ్ళు తొక్కేస్తూ వెళ్ళకు;
నీ క్రౌర్యంతో
నా శౌర్యాన్ని రెచ్చగొట్టకు;

చూసి నడు
చూసి నడు

ఎత్తైన కీర్తి శిఖరం యెక్కబోయి
చిత్తుగా పడి పళ్ళూడ గొట్టుకోకు

నమ్రతతో పయనించు
నలువైపులా గమనించు

చూసి నడు
చూసి నడు

ముళ్ళు విత్తి మల్లెలు వెతక్కు
అమృతం అనుకుని రుధిరం గతక్కు
అశాశ్వతమైన ధనరాశిని
శాశ్వతమని భ్రమపడి చితక్కు

చూసినడు
చూసినడు

కాలం వేసిన గాలం
కోరుతోంది నీ గళం

అతి తెలివి తేటల తొందరలో
అజ్ఞత అంటుతోంది నసాళం

చూసి నడు
చూసి నడు

# దేవుడి చేతి రుమాలు

ఈ సమావృత హిమావగుంఠనం
దేవుడి తెల్లని చేతి రుమాలు;
భూప్రేయసికి అతని జాడను
పోల్చుకోడానికి ఇదో ఆనవాలు

ఇటే వెళ్ళి ఉంటాడు దేవుడు,
అభిసారికా ప్రేయసికి అందడు;
గగనంలో దేవుడి పద చిహ్నం
కనిపించీ కనిపించని సూర్యబింబం

ఆ మేఘం అతడి శ్వేతాంచలం
ఆ సంధ్య అతడి పీతాంబరం
ప్రియుడి చేతిరుమాలు చేతపుచ్చుకుని
విరహం అనుభవిస్తూంది భూభామిని

అదిగో! వచ్చేస్తూంది హేమంతయామిని
ఏకాకులకు అది శాకినీ. డాకిని!
వెలిగించండి గుండెల్లో ప్రణయం-
చలికి సంయోగమంటే చచ్చే భయం!

# శాంతి పతాకం

సాటివాని రక్తం కోరే
చచ్చుమనిషి ఒక మనిషేనా ?
మృత్యువు నృత్యంచూసి హసించే
నరుడు కూడ ఒక నరుడేనా ?

ఎన్నటికైనా తప్పని చావును
ఎందుకు తొందరపడి కోరాలి ?
పసిపాపలను, పడుచువారలను,
పడతులనెందుకు చంపాలి ?

చావును గెలవాలంటూ కొందరు
శాస్త్రజ్ఞులు శ్రమ పడుతున్నారే !
అహోరాత్రములు లెబరెటరీలో
అనేక ప్రయోగాల్ చేస్తున్నారే !

మృత్యురాక్షసీ నగ్న విహారం
నిత్యం ఇలాగ ఎందుకని ?
ఇరాన్, ఇరాక్ దేశాల మధ్య
ఈ మారణ హోమం ఎందుకని ?

జంతువులే నయమనిపించేలా
జనులెందుకిలా ప్రవర్తించడం ?
శాంతి పతాకం ఎగరేయాలి !
క్రాంతి గీతములు వినిపించాలి.

# పురోగమనం

మమ్మల్ని వెనక్కి రమ్మని బులిపించేవారికి
మరోసారి వినమ్రంగా సలాం చేస్తున్నాను;
వెను తిరగడం తెలియని వీర యోధుల్ని
పెనుతుఫానులు ఆపలేవని మనవి చేస్తున్నాను

ధర్మ చక్ర రథారూఢులమై మేము
కర్మపథాల్లో క్రాంతి పతాకం ఎగరేస్తూ
కడువేగంగా వెళ్ళి పోతున్నాం గమ్యంవైపు—
నడవలేని వారికి నడుమ నడుమ చేయూతనిస్తూ

నా పతాకం మీద స్వాతంత్ర్య జ్యోతిశ్చక్రం వుంది
నా కరవాలం మీద శత్రువు రక్త బిందు బృందం వుంది
నా కుడి భుజం మీది గాయం స్రవించే రుధిరం
నవ పద్మంలా నా శరీర సరస్సులో విరిసింది

ఎన్ని అడ్డంకులు వచ్చినా మనం పురోగమిస్తాం
ఈ అనంతయాత్రను ఆపదలచే వాళ్ళను తిరస్కరిస్తాం;
తిరోగాముల పన్నాగాల మీద ఆంక్ష విధిస్తాం
స్వాతంత్ర్య సంరక్షణ మన బాధ్యతగా స్వీకరిస్తాం

ఈ తూర్పు చిరకాలం మేఘచ్ఛన్నంగా వుండదు
ఈ విషసర్ప ఫూత్కారాలకు ఈ జీవి భయపడదు
గారుడ మహాస్త్రంతో గాండీవిలా వెళుతున్నాను
క్షణం ఆగకుండా నా రథాన్ని నడుపుతున్నాను

పిరికిపందలారా ! ధనంతో మమ్మల్ని కొంటారా!
విపణిలో మేం అమ్ముడుపోమని తెలుసుకోలేరా?
వెనక్కి నడిచే మీ వెనుక విషపు గుంతలున్నాయి
పడిపోయారంటే మీ తనువులు ఊబిలో దాక్కుంటాయి

# ఉగాది నగారా

తెలుగింటి ముందరి వసారా
లో మ్రోగె నౌబత్ నగారా,

వెలసింది వాసంత లక్ష్మి
విజయం గులాబీలదేరా :

ఆడింది పువ్వుల పతాక
ఊదింది చిలకమ్మ బాకా

భువిలోన వెలిగించె వలపు
నవ వత్సర స్వామిరాక

మాకంద శాఖాళిపైన
మీటేను పికభామ వీణ

మౌనాలు గడిచాయి; తీయని
గానాలె లోకాల లోన

ఆసేతు హిమశైల సీమ
ఆడింది వాసంత భామ

స్నేహాన్ని కోరేను లోకం
హృదయాల నిండేను ప్రేమ

నవతా విలాసాల తేలి
యువతా వినోదాల సోలి

భరత ప్రపంచమ్ము నేడు
సలిపింది వాసంతకేళి

మలయానిలం వీచు చోట
మన హృదయమే మల్లెతోట

నిరుపేదలకు నేడు దొరికె
సంతృప్తి ముత్యాల మూట,

# ఆమని పాట

మామిడికొమ్మ వీణగా
మనోహరగీతం ఆలపిస్తూ
మనసు మేల్కొల్పుతున్న ఆమని
మానవతా నవరత్నాల గని

ఈ గనిలోనుంచి వెలువడిన
అమూల్య మాణిక్యరాశులు
సామాన్య విపణిలో దొరకవు:
ధనం ఎంతపోసినా లొంగవు

ఈ రత్నాలను, మాణిక్యాలను
ఇంటికి తెచ్చుకోవాలనుకున్నవారు
జాతికోసం, దేశంకోసం
చేతనైనన్ని త్యాగాలు చేయాలి

ఇంటిలోపలా, ఇంటి వెలుపలా
కొంటెకోణంగులు కుట్రపన్నుతున్నారు:
'ఆసేతుహిమాచల పర్యంతం ఐక్యం'
అన్నమాటను అబద్ధం చేయాలని చూస్తున్నారు

మనజాతి పతాకం తలవంచదని
వనంలోని ఆమ్రశాఖాగ్రం చెబుతున్నది
మన ఐక్యమత్యం ఏనాటికీ చెడదని
మల్లీ, మాలతీ మంజరి అంటున్నది

విరబూసిన సుందరోద్యానం లా
భరతభూమి కళకళ లాడాలి;
ఈనాడు వచ్చిన పచ్చని వసంతం
ఇలాగే కలకాలం ఉండిపోవాలి.

# రసాల గీతం

విషాలు కురిసే జగాన నేడూ
రసాల గీతం వినిపించె;
ఎడారి వంటి ధరాతలంలో
సుమాంగనా మణి కనిపించె

వనాంత సీమల వసంత కన్యా
ప్రశాంత రూపం మురిసింది
ఉగాది వేళల ప్రజాళి లోపల
ఉషో విలాసం విరిసింది

పల్లే, పట్నం ఉల్లాసంతో
పరవశించినవి ఈనాడు
శ్రమికుడు, కృషికులు తమ తమ పథముల
పురోగమించిరి ఈ రోజు

చైత్ర రథంపై జెండా యెగిరెను
సవితృ కిరణముల నీడలలో;
జవ్వనులంతా ఊరేగిరి తమ
నవ్వుల పువ్వుల వాడలలో

పలాశములపై, రసాలములపై
పరిభ్రమించెను భ్రమరాలు
నిశాంత వేళల సరోవరంలో
హసించ సాగెను కమలాలు

ప్రజలారా! ఇది ఉగాది వేళ,
ప్రపంచమంతా వసంత హేల;
సముజ్జ్వలంబగు భవిష్యమునకై
పరిశ్రమించగ రారేలా?

# వసంతోదయం

చీకటిలో చంద్రరేఖ
శిశిరంలో వసంతుని రాక
విరహికి నెచ్చెలిలేఖ
పరిణామపు తొలికేక

అట్టడుగున ఉన్నవారి
నాదుకొనుట కోసం
భరత జాతి సమైక్యతను
పరిరక్షించుట కోసం

ప్రజాస్వామ్య పథంమీద
పయనించుట కోసం
ఆసేతు హిమాచలము
ఐక్యమైంది మనదేశం

తరతమ భేదాలు లేవు
భరత జాతి ఒకటి;
ప్రజాస్వామ్య వ్యవస్థలో
ప్రజలంతా ఒకటి;

జగాన్ని మురిపించుటకై
ఉగాది వచ్చిన వేళ
పెళ్ళి పందిరై వున్నది
చల్లని మన తెలుగు నేల

# అచుంబిత జ్వాల

జ్వాలను చుంబించ దలచాను
శలభమనై ముందు నిలిచాను
నిశా నిశాంత ప్రశాంత వేళ
నిశిత కాంతినే వలచాను

అగ్ని గీతాలు పాడాను
ఆనందంతో ఆడాను
మందారంలా ముందు నిలిచిన
సుందరి చేతిలో ఓడాను

ఓటమిలోనే గెలుపుంది
మౌనంలోనే పిలుపుంది;
దివ్వెల పండుగ సవ్వడిలోనే
నవ్వుల వెలుగుల తెలుపుంది

నవ దీపావళి వచ్చింది
యువ హృదయాలను మెచ్చింది
గగన భాగ హరినీల సరసిలో
కాంతి కమలమే విచ్చింది

చీకటి వజవజ వణికింది
చేతన అంతట తొణికింది
సహస్ర కరముల శ్యామవ్యోమం
జలధి బుగ్గలను పుణికింది

విజృంభించినది ఈ జ్వాల
నృత్యమాడినది ఈవేళ !
జ్వాలా నృత్యం చూసీ చూసీ
మనసు ఊగినది ఉయ్యాల

జ్వాలా, శలభ ప్రణయాలు
త్యాగానికి సంకేతాలు
షీరీఁ ఫర్హాద్, లైలామజ్నూ
జంటల హృదయ ధ్వానాలు.

# దీపాల మందార మంజరి

దీపాల మందార మంజరి
దిశలందు నింపింది సుందరి ;
నీలాల చీకట్ల తోటలో
నిలిపింది అందాల పందిరి

తారాళి దిగివచ్చె నేలకు,
దండాలు దీపాల మాలకు ;
రావోయి ఓ రసిక సత్తమా !
కవితా సుధా పానశాలకు

పీతాంబరం కట్టుకున్నది
విరజాజిలా నవ్వుతున్నది ;
నగ్నాంధకారాల దారిలో
నడిచేటి దివ్వెలాగున్నది

అటుచూచె ఇటుచూచె భామిని
అనురాగమయమాయె యామిని ;
రణమందు చెలరేగు ఖడ్గమై
ప్రతివారి నోడించె కామిని !

హేమంత సీమంతినీ మణి
సీమంత సింధూర రేఖగా
బాలార్క కిరణం సుమించెను
జ్వాలయని జగమే భ్రమించెను

# స్నేహాంజలి

దీపం వద్దకు వెళ్ళాను
నీ పేరేమని అడిగాను
"నను వెలిగించిన వనిత మనసులో
అనురాగము" నని విన్నాను

చీకటి చెంతకు చేరాను
చెక్కిలి మెల్లగ మీటాను;
సిగ్గు ముసుగులో నవ్విన చీకటి
బుగ్గల వెలుగులు చూశాను

అవాయి చువ్వలు ముట్టించాను
ఆకాశ మార్గం పట్టించాను ;
చుక్కలతో అవి గుసగుసలాడగ
చూచి, ఏమేమొ ఊహించాను

ఎన్నడు నవ్వని నిర్భాగ్యులకు
కన్నీరై వున్న దౌర్భాగ్యులకు
ఆహ్లాదమిడే దీపావళికి
అంజలి ఘటించుతున్నాను

తరగని స్నేహం, చెరగని స్నేహం;
స్నేహమంటె నా కెంతో మోహం ;
తీర దెన్నటికి ఈ దాహం
నా స్నేహితులకు దాసోహం,

# ధూమ పతాకం

ఉగాది శుభ సమయాన
ఉన్నదున్నట్లు చెబుతున్నా ;
సోమరి పోతుల కీ లోకంలో
చోటు లేనే లేదన్నా !

పల్లెలో పరిశ్రమిస్తాడు కర్షకుడు
మిల్లులో వొళ్ళు హూనం చేసుకుంటాడు కార్మికుడు ;
ప్రగతిశీల కవుల కావ్యానికి
పరిశ్రమించే మానవుడే నాయకుడు

తీయని ఉగాది శుభవేళ
కోయిల పాట రుచించదేల ?
నలుదెసల మారుమ్రోగే ఫ్యాక్టరీ కూత
మన పాలిటి భగవద్గీత

ధూమ పతాకం చేతగొని
యేమంటున్నది ఆ గిర్నీ ?
పాతకాలమును మరువమని
కొత్త జగము నిర్మించమని

# స్థిర లక్ష్యం

తూర్పు తలుపులు తెరచుకోనీ !
మార్పు గాడ్పులు పరచుకోనీ !
ఎందుకీ శిధిలావనీ గా
ఢాంధకార పినద్ధ రజని ?

బ్రతుకు జాడల మహారణములు ;
ప్రయాణములో గడచె దినములు ;
నడచి నడచి పదాలు కందెను,
నయనములు జ్వలదగ్ని కణములు

నిదురనే రుచి చూడకుంటివి
కదలుటయె నా ధ్యేయమంటివి
ఎంతదూరము వెళ్ళినను వి
భ్రాంత శూన్య పథమ్మె కంటివి

ఎంతకని ఈ పశ్చిమాశా
ధ్వాంత కాంతారాభిలాష ?
ప్రాగ్దిశాంచల సంచలత్ ప్రా
భాత మనగా ఏల "గోషా ?"

ముసుగుపై విసుగైన రాదా?
ప్రొద్దు కాంచను మనసు లేదా?
సూర్య ముఖివై తిరుగు: ఔషస
తూర్య రుతి వినిపించ బోదా?

గమ్య మొక దిశ, గహన మొక దిశ
గడవదా తుదిలేని ఈ నిశ?
సాగిపో! స్థిర లక్ష్యముంటే;
సమీపములో కలదు శుభ దశ!

# కాలదర్పం

నిండు జాబిల్లికి అడ్డుగా నిలిచిన
నీల మేఘ పటలాలను
మారుత కరాహతితో
దూరం చేసేస్తున్నాను

మండుతున్న మార్తాండ గోళం యెదుట
మంచు తెరలు దించిన హేమంతాన్ని
వసంత రజ్జువుతో పైకి లాగేసి
పసందైన 'రూపకం' ప్రారంభిస్తున్నాను

తెల్ల విషం విజృంభించిన నల్ల దేశంలో
''నల్ల''లోని ఎర్రను ఔషధంగా చేసి,
విచికిత్సలో పడ్డవాళ్ళను వేరుచేసి
చికిత్స సాగిస్తున్నాను

సమసమాజ సౌధ నిర్మాణానికి
శ్రమ జీవులు చేస్తున్న కృషిని
ఆటంక పరిచే అనర్థ అర్థ బలాన్ని
ఐకమత్య కుఠారంతో నరుకుతున్నాను

కాల సర్పాన్ని కాటేసి కాజేసిన
కాల దర్పాన్ని నేను ;
తిరోగమిస్తున్న లోకాన్ని నిలబెట్టి
పురోగమనం నేర్పుతున్న ప్రగతిని నేను

# ప్రగతి పథాన జగతి

ఉగాది, ప్రగతికి సంకేతం
ఉగాది, జగతికి సందేశం
ప్రశాంతి కోసం పరిశ్రమించే
ప్రపంచ జనులకు సంతోషం

విశాల విశ్వ ప్రజా సమూహం
నిశాదివము లాశించే దేమిటి ?
అణుమహాస్త్రములు అంతం కానీ
అశాంతి, సమరం నశించిపోనీ

అరబ్బు జనులు, ఆఫ్రికా ప్రజలు
పాలస్తీనా వ్యథా జీవులు
సుఖ శాంతులతో శోభించాలి
అఖిల లోకము హర్షించాలి

తూర్పు పడమరల తొంగి చూసినది
మార్పును కోరే మధు మాసం ;
ఊర్పులు ఆర్పులు లేని సమాజం
ఏర్పడు సమయం లేదిక దూరం

కలయే మామిడి తోపైతే
కవితే కోయిల పాటైతే
ఉగాదియే సమ సమాజానికే
పునాదియైతే, స్వాగతము !

# వర్తమాన నర్తనశాల

కోయిల రెక్కల మీద యెక్కి
'కో' అంటూ వచ్చింది ఉగాది ;
ఈ అందాల ఉగాది నాది
నా ఒక్కడిదే కాదు——నీదీ !

చేదు వేపలో కూడా
స్వాదుత్వం చూస్తున్నాను ;
ఒగరు మామిడి చిగురులోను
మాధుర్యం భావిస్తున్నాను నేను

ఈ నిరాశామయ లోకంలో
ఆశామృతం చిలకడానికి,
జడీభవించిన హృదయాలలో
చైతన్యం ఒలకడానికి,
దేవతలా వచ్చింది ఉగాది ;
జీవిత వల్లరికి ఆమెయే ప్రోది

ఈ ఆమ్ర తరు శాఖాగ్రం నుంచి
ఎంత మధురమైన పిలుపు !
ఓడిపోతున్న మానవుడికి
నేడు యాదృచ్ఛికమైన గెలుపు

నాకు ముకుళాల మీద, వకుళాల మీద
నవ నందన సుందర మందారాలమీద
వర్తమాన, కళామయ నర్తనశాల మీద
భవిష్యద్భాగ్యోదయ దినాల మీద
అంతులేని విశ్వాసం ఉంది ;
అందుకే మనస్సు ఆశతో జీవిస్తూంది

# దీక్ష

హిట్లర్ పోయాడని నమ్మేసి
చెట్లు మరల చిగురించాయి

ముసోలినీ ఇక లేనే లేడని
ముళ్ళు మల్లెలై విరిసాయి.

"టోజో ! జో ! జో ! సమాధిలో" అని
జాజులు పాటలు పాడాయి

ముప్పై వసంత కాలాలు
ముద్దుముచ్చటగ గడిచాయి

ఇంతలో ఇదేం ఉత్పాతం ?
అతిభీకర శిశిరాఘాతం !

హిట్లర్ 'ఉన్నా' నంటున్నాడు
టోజో 'ఉన్నా' నంటున్నాడు

నయా నయా ఫాసిస్టులు భువిలో
నాట్యం చేస్తూ వస్తున్నారు

వీణలు వాయిస్తున్నారు
వేణువు లూదేస్తున్నారు

వీణ వీణలో ఫిరంగి మోత !
వేణు రంధ్రముల మృత్యువు కూత !

భారత దేశ ప్రజాస్వామ్య నవ
వన వాటికలో సామ్యవాద సుమ
వల్లరి పందిరి ప్రాకనివ్వరట !
మల్లెల గుమగుమలాడ నివ్వరట !

మన దారిని మననేగనివ్వరట !
మన పద్ధతి కొనసాగనివ్వరట !

ధన స్వామ్యమును నింపేస్తారట !
జన స్వామ్యమును చంపేస్తారట !

రామచంద్రులై రా రండి !
రావణాసురుల తుసుమండి !

ప్రజాసేనలై లేవండి !
ప్రజాశత్రువుల చెండండి !

కాలసర్ప ఫణ గణాలమీద
గరుత్మంతులై దూకండి !

ధన స్వామ్యమిక చెల్లదులే !
జన స్వామ్యమిక డుల్లదులే !

# వైజయంతిక

మువ్వన్నెల బావుటా
నవ్వుతోంది అంతటా—
హిమాలయం ముంగిట
సముద్రాల సందిట

భరతజాతి గౌరవం
భద్రపరచు కేతనం ;
ఎంతకాల మైనగాని
ఎపుడు నిత్య నూతనం

భరతమాత చేతిలో
మురియు వైజయంతిక ;
అవని పైకి దిగివచ్చే
అభినవ వాసంతిక

సాంద్రవర్ణములు చిందే
ఇంద్రచాప మిదే ! యిదే !
స్వాతంత్ర్య ప్రభలీనే
భవ్య దివ్య దీప మిదే

ప్రపంచాన భరతజాతి
విపంచిపై మధురగీతి
పలికించే సమయమిది
ప్రజలకు శుభ తరుణమిది

అరువది కోట్ల జనావళి
ఐక్యంగా వున్ననాడు
ఈ స్వేచ్ఛా పతాకను
యెవ్వడేమి చేయలేడు.

కర్షక, కార్మిక, కవిగణ
హర్షాంచిత సువర్ణాలు
మనజాతి పతాకలోన
కనిపించే త్రివర్ణాలు

# ఇంద్ర ధనుః కిరీటం

నీలమేఘ చికురాల మీద
నిటారుగా నిలబడేలా

ఇంద్ర ధనుః కిరీటం ధరించి
ఇలాదేవి ఎంతో సొగసుగా వుంది ;

మండుతున్న మార్తాండ కిరీటాన్ని
మస్తిష్కంపై ధరించిన భూమి

గ్రీష్మకాలం గడచిపోగానే
కిరీటం మార్చేసింది సుమీ :

దరిద్రుని జీర్ణ పర్ణకుటీరం ముందు
హరిద్రా వర్ణ కుసుమం విరిసింది ;

పచ్చగన్నేరు పువ్వులోని అందం
పచ్చల హారంలోనైనా శూన్యం

శుక్తిలోనుంచి ముక్తాఫలం అపహరించినట్లు
యుక్తిగా యెదలోనుంచి హృదయం దొంగిలించి

కామినీ చూడామణి, వర్షాకాలంలో
యామినీ యవనికలో దాక్కుంది

* స్తంభాద్రి నృసింహస్వామి ఆలయాన
కుంభవర్షం కురుస్తున్న సమయాన

ఆనాటి అతిమనోహర ఘటనలు
ఈనాడు జ్ఞాపకం వస్తున్నాయి అనేకములు

---

* ఖమ్మంలో నరసింహస్వామి గుట్ట

నాల్క ఒకటెగాని నన్నూరు భాషలు

నరుని భాష నరుడె యెరుగలేడు ;

భూమి ఒకటెగాని భూనేత లెందరో !

ఒకని జూచి ఒకడు ఓర్వలేడు !

సంయోగంలో నిద్దురలేదు
వియోగంలో నిద్దురరాదు
కంటికి నిద్దుర కరువైనప్పుడు
పగటికి, రాత్రికి తేడా లేదు

# ముత్యం

తెలుపు సగం నలుపు సగం
గల ముత్యం యేది ?
కాటుక కన్నుల నుండి జారిన
కన్నీటి కణమే అది !

ఫార్సీ మూలం : జేబున్నిసా

# మనసు - మెదడు

మానవ హృదయపు లోగిలిలోన
మాధవు డెప్పుడు వుంటాడు ;
మేధాశక్తికి లొంగినవాడు
మాధవుడెట్లా అవుతాడు ?
మనిషి హృదయము, మెదడు సైతము
మన్ను, నీరుతో చేసినవైనా,
మెదడు నేలనే కోరేను
హృదయం నింగిని చేరేను.

ఫార్సీమూలం :- డాక్టర్ ఇక్బాల్

# కు రు ల వ ల

నీ కురుల తోడ వలను పన్నితివి నీవు,

అందు వలపుల గింజలు చిందినావు ;

నా మనస్సను పిచ్చుక నడచి వచ్చి

వలపు గింజలు తినగోరి వలను చిక్కె

ఫార్సీ మూలం : హాఫిజ్ షీరాజీ

## జలధీ - జలకణము

ఒక్క చిన్ననీటి చుక్కలో సంద్రమ్ము
ఒదిగి బందివోలె ఉన్నదోయి !

## అణువు - అర్కుడు

అణువు గుండెను ఛేదించినంతలోనె
భాస్కరుని నుండి రక్తము పారదొడగె !

ఉర్దూ మూలం : డాక్టర్ ఇక్బాల్.

# చిలకబొట్టు

ఖజాన చిలకబొమ్మ పచ్చబొట్టును
పొడవమని వచ్చాడొకతను ;
సోది చెబుతున్నవాడు
సూది తగలగానే గొల్లుమన్నాడు ;
తోకనుంచి మొదలు పెట్టానన్నాను,
తోక లేకుంటే చిలుకకు తొందరేమిటన్నాడు ;
ముక్కుతో మొదలు పెడతానన్నాను
ముక్కు లేకుంటే చిలకకు మునిగిపోయిందేమిటన్నాడు ;
ముక్కూ. తోకా లేని చిలక
ఎక్కడుంటుంది గనక !
బాధ ఓర్వలేని వాడు, బంధనాలు తెంచుకోలేడు ;
కాంతిలో బతకదలచినవాడు
ధ్వాంత జీవితాన్ని భరిస్తాడు.

(పార్సీకవి మౌలానా రూమీ కి సలాములతో)

# వివేక సూర్యోదయం

ఎప్పటికి మారుతుంది ఈ అస్తవ్యస్త వ్యవస్థ ?
ఎన్నాళ్ళు ప్రపంచ ప్రజలకీ అవస్థ ?
ప్రశ్నిస్తున్నారు ఆలోచనాపరులు,
ఎవడికి పట్టింది జవాబు చెప్పే దురవస్థ ?

జనుల దౌర్బల్యాలను వాడుకునే వారు
జపతపాలతో స్వర్గం వస్తుందంటున్నారు;
ప్రజలను విజ్ఞాన వంతుల్ని చేస్తామని
ప్రతిజ్ఞ బూని రచయితలు వ్రాస్తున్నారు

వివేక సూర్యోదయాన్ని ఆ మధ్య పిలిపించారు;
ఏమి చేసినా అజ్ఞాన తిమిరాలు శాశ్వతంగా
భూమిని విడచి పోవడం లేదని విలపించారు.

వారు వ్రాశారు ప్రపంచ ప్రజలకు నవలేఖ,
వారు వేశారు లోకాన్ని మేల్కొలిపే పొలికేక ;

కేక వినపడదు; లేఖకు జవాబు రాదు ;
అయినా తొలగిపోలేదు వారిలోని ఆశారేఖ

ఆదర్శాల కోసం బలి అయిపోయినవారు కొందరు ?
ఆ కొందరిని జ్ఞాపకం ఉంచుకున్నవారు ఎందరు ?
అసువులు సమర్పిస్తున్న వారు సామాన్యులు
అసామాన్యులు వారికోసం అశ్రువులైనా చిందరు

# క్రాంతి గీతం

(దేవతలతో దేవుడు)

నా జగమునగల పేదల మేల్కొలుపండి
ధనవంతుల సౌధాలను కదలించండి

బానిస ప్రజ రుధిరమ్మును ఉడికించండి
డేగలతో పిచికల పోరాడించండి.

వస్తోంది ప్రజాస్వామిక మంగళవేళ
పాతదనపు చిహ్నాలను చెరిపేయండి

ఏ పొలమున రైతన్నకె దొరకదో తిండి
ఆ పొలమునగల పంటను తగలేయండి !

దేవుడికీ జీవులకూ తెరలెందుకని ?
గుడి లోపలి పూజారిని తొలగించండి

చలువ రాతి దేవళాల విసుగొచ్చింది
మట్టితోటి ఇల్లు నాకు కట్టించండి

నవ సంస్కృతి భువిలోపల చివురించింది
తూర్పు కవికి నవ సభ్యత నేర్పించండి

ఉర్దూ మూలం : డాక్టర్ ఇక్బాల్

(బాలె జిబ్రయీల్ కావ్యం నుండి)

# వెలుగు పాట

నడిచే దివ్వె
నాతో నవ్వె
నలుదెసలందున
వెలుగులు రువ్వె

వలపులు తెలియని బ్రతుకుల నిండా
చెలరేగినది తలపుల జండా ;
రెపరెపలాడే దీపజ్వాల
రేయంతా ఏకాకికి అండ

గాలికి ఆరే జ్వాల లవేలా ?
కావలసినది హృదయ జ్వాల ;
జీవితమంతా ఆరని తపన
చేయించును కవితో నవ రచన

ఈ దీపావళి దివ్వెలతోట
ముద్దులు చిందే పువ్వుల కోట ;
ప్రణయానుభవమ్ములు గుంపు గుంపులై
పద్యహారమున నిలిచె కెంపులై

తిలకము - మోమున
దివ్వియ కాగా
కలికి కులుకుతూ
ముందుకు రాగా
తమో విపంచీ తంత్రుల నోట
వినిపించింది వెలుగుల పాట

# ఘాసాంకుర పతాక

శ్యామల ఘాసాంకుర పతాకతో
సైనిక వీరుడినై నడిచి వెళ్ళుతున్నాను
నా చేతిలో తుపాకి లేదు
నా గీతిలో నిరాశలేదు

నేను లోకానికి ప్రదర్శించదలచింది
నిజంగా ఒక్కటే ఒక్క అంశం ;
అదేమిటంటే—అణు మారణాస్త్రాలతో
అవనిమీద అతిసామాన్య మానవుణ్ణి సైతం
అణగార్చడం అసాధ్యం ;

మృత్యువును ఊరూరా ప్రతిష్ఠించి
మృత్యుసింహాసనం మీద అధిష్ఠించి
ప్రపంచాన్ని ఏలాలనుకోవడమంత మౌర్ఖ్యం
మరోటి ప్రపంచంలో చూడం

ఎవరు ఎన్నెన్ని అధునాతన మారణాయుధాలతో
నా దారికి అడ్డువచ్చినా, నేను
వియత్నాంలా విజయం సాధిస్తాను
విశ్వప్రజా శక్తిని ఆరాధిస్తాను ;
నన్ను ఓడించడం ఎవరితరం కాదు
నాకు అపజయం ఏ నాటికీ లేదు

నేను శ్రామిక జనార్దనుణ్ణి
నేను కార్మిక వ్యతిరేకి కాళియ మర్దనుణ్ణి ;
నేను సామాన్య ప్రపంచ పౌరుణ్ణి
అయినా నేను అసామాన్య ప్రజా వీరుణ్ణి

కులం పేరిట బతికే వాళ్ళని
ధనం బలంతో తిరిగే వాళ్ళని
సమానతా శక్తితో ఎదుర్కొంటాను
జన శత్రువుల కుయుక్తిని బయట పెడతాను

వర్తమాన నర్తనశాలలో
నర్తించే నగ్న జీవుల్ని
ఆగామి అభ్యుదయ సమాజంలో
అంబరాలు కట్టించి ఇంటిదారి పట్టిస్తాను

కుట్రలూ కృత్రిమాలూ తెలియని
కోట్లాది ప్రజలారా !
దొడ్డదొరల నడ్డి విరగ్గొట్టే
గడ్డిపోచ జండా చేత పుచ్చుకొని
నాతో నడచి రండర్రా !

ఇవాళ వంచనచేసి విర్రవీగే వాళ్ళని
ఇక రేపు మంచితనపు మహాశక్తితో గెలుస్తాం :
లేళ్ళతో కలిసి పరుగెత్తి
జాగిలాలతో కలసి వేటాడే
ద్విముఖ జీవులంటే, ఈలోకం
విముఖత ప్రదర్శిస్తుంది రేపు

# * ప్రణయలోక రాజధాని

అఖిల జగజ్జనావళికి
హనీమూన్ రాజధాని
నయాగరా జలపాతం
నవ దంపతి తొలి గీతం

అర్ధ చంద్ర రూపం గల
అతి సుందర జలపాతం
ఎగజిమ్మె తుంపరతో
సొగసైన హరిచాపం

జలపాతం, హరిచాపం
కలిసి మెలిసి ఉంటాయి ;
యెండ మాయమవగానే
యెడబాటును పొందుతాయి

యెన్ని జంట లిచట కలసి
యెన్ని కలలు కన్నారో ?
కలలు నిజము కానప్పుడు
యెంత వ్యధితులైనారో

* Honeymoon Capital of the world – Niagara Waterfall

హిమగీతం పాడుతుంది
ఇక్కడి శీతల వాతం ;
చలి నెదిరించుటకోసం
చెలిని మనసు వెతుకుతుంది.

తేనె చందమామ వచ్చి
మౌనంగా నవ్వినపుడు
ఎన్ని తీపి నేరాలో !
ఎన్ని చేదు సత్యాలో !

ప్రతి మాటకు ఈ పూట
ప్రణయమనే అర్థమే ;
ప్రతి బాటకు ఈ చోట
హృదయమొక్క గమ్యమే

దూర ప్రాంతాలవారు
చేరువగా వస్తారు ;
హృదయాల్లో ప్రమోదాలు;
ఏమరితే, ప్రమాదాలు !

రెండు గుండె లొకటిచేయు
దండివాగు, నయాగరా ;
అది కన్నుల ముందుంటే
కదలలేము ససేమిరా

మహా ప్రకృతి కావ్యానికి
మరో సిరా, నయాగరా
చైతన్య స్వాంతానికి
సంకేతం, నయాగరా.

# సంక్రాంతి గోరంటలు

శివాలయావరణంలో
నవనవలాడే ఆకుపచ్చ కొమ్మల్లో
విచ్చుకున్న పచ్చగన్నేరు సుమ దళాన
వచ్చి కురిసింది తొలిమంచు సోన

చిరు బుట్టనిండా గన్నేరు పూలు
సిగనిండా ఇంద్ర ధనుశ్శకలాలు ;
    జవ్వని పూజకు వెళుతోంది
    స్వాగతం చెబుతోంది నంది

సంక్రాంతి శుభ సమయంలో
చలికి భయపడని తొలి సంధ్యలో
    బాలభాను పరమ సుకుమార కిరణాలు
    బాలామణి బుగ్గపై కురిశాయి చుంబనాలు

ఆమె మనసులో ఉన్నదంతా భక్తి
ఆమె కనులలో వున్నదెంతో రక్తి
    భక్తికీ రక్తికీ మధ్య గల ఉల్లిపొర తెర
    భక్త పరాధీనుడైన స్వామికే ఉడుగర

చిరు చలిలో, చిరువేడిలో పులకింతలు
చిత్రకారుని కుంచియకు గిలిగింతలు ;
    పరమ శివుని ఆలయంలో జేగంటలు
    ధ్వనిస్తే సుమిస్తాయి కవిత్వపు గోరంటలు

# వక్రభాష్యాలు

తిరిగే భూగోళాన్ని ఆపేయండి ;
దిగి పోతా న్నేను ;
మానవత వసించవలసిన చోట
దానవత సహించలేను

నరకం లేదు లేదన్న వాళ్ళే
నరలోకాన్ని నరకం చేశారు ;
స్వర్గం వట్టిది వట్టిదన్న వాళ్ళే
స్వప్రయోజనాల స్వర్గం సృష్టించారు

దేవుడు లేడన్న వారే తమ సిద్ధాంతాల
దేవాలయాలు నిర్మించారు ;
వాటిలోకి మానవ కోటిని పడద్రోసి
బందీలుగా చేసి పారేశారు

విగ్రహాలు పనికిరావని తోసేశారు
విగ్రహంలేని మనుషుల బొమ్మల్ని పూజించారు;
ఏది వద్దంటున్నారో అదే చేస్తున్నారు
ఏదీ తెలియని సామాన్యుల్ని మోసగిస్తున్నారు

మేధావు లనబడేవారి వక్ర భాష్యాలు
బాధలన్నిటినీ సృష్టించే విషబీజాలు ;
సవ్యంగా ఆలోచించేవాడు లేని నాడు
"సవ్యసాచు"ల వల్ల ఈ లోకానికి కీడు

నగ్నంగా ప్రవహించే నది కావాలి
అగ్ని శకలాలు విసిరే రవి రావాలి
రుగ్నమైన మేధాశక్తులు పోవాలి
భగ్న హృదయాలలో ఆశ లేవాలి

తిరిగే భూగోళాన్ని ఆపేయండి
దిగి పోతా న్నేను
మానవత వసించవలసిన చోట
దానవత సహించలేను.

# పరిణామం

ఉగాది, పరిణామ పతాక
ఉగాది, విప్లవ ప్రతీక ;
మంచి తిథిన వచ్చిన అతిథిని,
మనని వదలి పోనివ్వకండి, ఉగాదిని

కామినీ కేశపాశాల్తో కట్టేయండి
భామినీ ప్రణయపాశాల్తో బంధించండి
సుందర పలాశాల కారాగృహంలో
బందీని చేయండి అవసరమైతే

మామిడి పిందెల అందెల సవ్వడితో
మలయానిలాల ఉరవడితో
మనింటికి వచ్చిన ఉగాదిని
మరో పది కాలాలపాటు ఆపండి

నిత్యయవ్వన హృదయులంతా
సత్యాగ్రహం చేయండి ఉగాది దారిలో ;
వెళ్ళడానికి వీల్లేదని విన్నవించండి
కాళ్ళను, ముళ్ళులేని గులాబీల్తో నిర్బంధించండి

నిరుపేదల గులాబీలు మోదుగులు
నిలువెత్తునా పోసి ముంచేయండి
"చుట్టానివి కావు, మా కుటుంబంలో
పుట్టిన దానివి" అని నచ్చ చెప్పండి

హృదయపు వల విసరి ఉగాది పారావతాన్ని
కదలకుండా పట్టేసి దాచుకుంటాను
కన్నుల పంజరంలో కలకాలం వుంచి
కన్నుల పండువుగా చూచుకుంటాను

# తరం అంతరం

తండ్రికీ కొడుక్కీ తరం అంతరం
గురువుకీ శిష్యుడికీ తరం అంతరం
నేతకూ జనతకూ తరం అంతరం
అంతరం తప్పదని అనుకుంటాం అందరం

వయసువల్ల వస్తాయి అంతరాలు
మనసువల్ల పోతాయి ఆ అంతరాలు
ఎందుకు ఈ అంతరాలు తరతరాలు ?
తెలుసుకుని మెలగాలి ఆంతర్యాలు !

అంతరాల దొంతరలు ఎంతకాలం ?
సమాజాన్ని కూల్చుటకు అవే మూలం;
యువతరాన్ని గుర్తించాలి
అంతరాలు లేకుండా వర్తించాలి.

# నవంబరు నవాంబరం

నవంబరు ఒకటి నాటి నవాంబరం
నలు చెరగుల తెలుగువారికి కలిగించును సంబరం
తెలుగు పలుకులోని బలం తెలిసినప్పుడు
కలుగుతుంది జనావళికి గుండె నిబ్బరం

పలుకలేనినాడు మనిషి పశువౌతాడు
పలుక గలుగువాడు పరబ్రహ్మ అవుతాడు
పల్కగల్గు నాల్కతోడ గుండెగూడ వున్ననాడు
నరుడు నిజమైన మానవుడవుతాడు

ప్రపంచాన తెలుగువాడు ఎక్కడున్నాగాని
తన వారితో అతనిని బంధించును వాణి ;
అనుక్షణం మన గుండెల కొండల నుండి
ప్రవహించును గలగలా గోదావరి, కృష్ణవేణి

# సాగర రత్నాలు

సాగరము నన్ను ఎన్నెన్నిసార్లు పిలచి
గుసగుసలుపోయె ? నాపైన రుసరుపడె ?
సాగరము తోచునాకు ప్రశాంతిలేని
పడతి హృదయమ్మువోలె ; దుందుడుకు కడలి !

ఎన్నిసాయం సమయములీ తిన్నెల పయి
అబ్ధితో ముద్దుముచ్చట లాడినానొ ?
ఎన్ని సూర్యోదయాలు దర్శించినానొ ?
ఎన్ని చంద్రోదయాల వీక్షించినానొ ?

ఎంత రుసరుసలాడిన నేమి లెమ్మ ?
నాకు బంధువు జలధి కన్యక, నిజమ్మ ;
అందు కోపతాపమ్ముల కంతులేదు
కాని అనురాగమేమి తగ్గంగ బోదు

నోరుగల సాగరిక ఎన్ని మారులిట్లు
నన్ను నిందించి అంతలో నవ్వలేదు ?
ఆమె హృదయమ్ము చల్లనిదయ్యుగూడ
వేడి లేదనలే, మది బాడబమ్మొ ?

కనికరించువారు కరువైన సమయాన
కంటనీటితోడ కనికరించు ;
పలుకరించువారు ఇల కానరానప్డు
పిలచి పిలచి నాదు వెతలు తీర్చు

గగనమున మేఘములు నింప గలుగుశక్తి
భాస్కరున కబ్బె నంబుధి వలన కాదె ?
జలధి తలమీద మేఘమాలలు వసింప
వెలది యెవ్వరో నామది కలతపరచు

నీలి తరగల కురులలో నింపికొనియె
నురుగుమల్లెలు ; ననుచూచి పరుగులెత్తె ;
కురుల నాపయి కప్పుకోగోరి నేను
అలలలో దాగికొన్నాడ వలపుతోడ

పడక గదియేల చక్కని జలధియుండ ?
పరుపులెందుకు శార్కర ధరణియుండ ?
డోలికలవేల వీచికామాలలుండ ?
వీవనలవేల ? పవమాన వితతియుండ ?

చెన్నపురి నన్ను కట్టివేసినది-శరధి
వీచికల గౌగిలింతల వింతతోడ ;
జలధి విడచిపోలేని దాశరథి మనసు
మాటిమాటికి శరధిపై పాట పాడు.

# అదృశ్య కావ్యాలు

శ్వాసకోశం లోని
పవనం కనిపించదు;
పసందైన మల్లెలోని
పరిమళం కనిపించదు

కలం కాగితం కాని హృదయంలోని
కవనం కనిపించదు ;
సుకుమార ప్రణయ లతికలోని
సుమదళం కనిపించదు

చరమ సంధ్యా గగనారుణ జలంలో
స్నానం చేసిన మబ్బుల కురుల మాటున
శశిబింబం లేనే లేదంటే
నపేమిరా నమ్మను

ప్రథమ సంధ్యా ప్రభారంగస్థలం మీద
ప్రధాన పాత్ర నిర్వహించడానికి
హిమ యవనిక చాటునుంచి రవి
ఇక రానే రాడంటే నమ్మను

కనిపించని దంతా అసత్యమనే
కనుల శక్తి ఎంతో చెప్పండి !
కనిపించని దంతా సత్యమనే
అనిత్య జగం గూర్చి ఊహించండి !

కాల కరవాల ధారలకు
ఖండ ఖండాలై పోయే బ్రతుకులు
కలకాలం నిలుస్తాయని భ్రమపడి
కఠోర కుఠారం అవుతాడు నరుడు

కనిపించిందంతా సత్యమూ కాదు
కనిపించని దంతా అసత్యమూ కాదు
మనోనేత్రం విప్పలేని పసికందులు
మానవులు ! - చదువలేరు అదృశ్య కావ్యాలు ! !

# హృదయ దిక్సూచి

న్యాయానికి మ్రొక్కుతూ
అన్యాయాన్ని పడద్రొక్కుతూ
పురోగమించండి వీరులారా!
పుణ్య భారత పౌరులారా!

కవ్వం ఆడితే గవ్యం
కలం ఆడితే కావ్యం
గవ్యం తనువు కోసం
కావ్యం మనసు కోసం

కలం బలం తెలియని వారు
కత్తుల కోసం వెతుకుతారు
ప్రాణాలు తీసేవి మనకెందుకు?
ప్రజలను మేల్కొల్పుదాం, రా! ముందుకు!

దేశం యేనాటికీ ఒక్కటి
దేశప్రజల ఆదేశం ఒక్కటి
కలాల్తో కులాల్ని కూలుస్తూ
కుల మతాతీత రాజ్య వనంలో
సమతా కుసుమాలు పూయిస్తూ
సమాజాన్ని దోచుకుని జీవించే
సైంధవు లనే ముళ్ళను తొలగిస్తూ
సమృద్ధి పథం మీద నడవండి
జనశక్తిని తెలుసుకుని మెలగండి

నలువైపులా చూస్తున్నారా నరహంతకుల్ని ?
తెలివిగా పూడ్చండి అరాచకపు కంతల్ని !
ప్రజాస్వామ్య సామ్య వాద చక్రం
ప్రయోగిస్తే నశిస్తుంది నక్రం ;
ప్రజా గజేంద్ర మోక్షకథ
ప్రజాకవులే వ్రాయగలరు కదా !

ఎటు చూపుతోంది ప్రజా హృదయం దిక్సూచి ?
అటు పయనిస్తే మనకు లేదు పేచీ.

# అర్థం లేని శబ్దాలు

అబ్దాలు శతాబ్దాలు గడచినా
శబ్దాలు అర్థాల తొడుగులు మార్చినా
నోళ్ళలో నలుగుతుంటాయి
కళ్ళలో కదులుతుంటాయి.

జేబుల్లో పడి ఉండి ఈ శబ్దాలు
చేతుల రాపిడికి నిగనిగలాడి
చిత్తస్థైర్యం లేని తొత్తు మనుషుల
చిత్తు కాగితాల బుట్టల్లో పడి,
మతిమరపు మస్తిష్కాల పాత ట్రంకు పెట్టెల్లో
అతీగతీ లేకుండా చెడి
ఎప్పుడో ఒకప్పుడు ప్రజావళికి
చప్పున జ్ఞాపకం వస్తుంటాయి

స్వాతంత్ర్యం !
సమభావం ! !
సౌహార్దం ! ! !

దారిద్ర్య రాక్షసి గాఢోపగూఢంలో
తబ్బిబ్బై పోయే పేద మానవుడు—
తాను ఎంత వరకు స్వతంత్రుడు ?

కులమతాల గుద్దులాటల్లో
నోట్ల చలామణీ మితి మీరిన ఆర్థిక వ్యవస్థలో
కోట్ల ధనం సంపాదించ వీలైన కుహనా సమాజంలో
ఎక్కడుంది సమభావం ?

గోడ ఎక్కి నిచ్చెన తన్నేసి
ఓడ మల్లన్నను బోడి మల్లన్న అనేసి
ఇష్టం వచ్చినట్లు దోచేసే
దుష్టులున్న లోకంలో
సౌహార్ద శబ్దానికి అర్థం ఏమిటి ?

ప్రజల్ని అస్వతంత్రుల్ని చేసేవారు
స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం అంటారు
అసమానతకు ఆలవాలమైన వారు
సమభావం, సమభావం అంటున్నారు

హృదయంలేని పక్కా స్వార్థపరులు
సౌహార్దం, సౌహార్దం అని వల్లిస్తుంటారు

సజీవమైన ఈ శబ్దాలు
చచ్చిపోయాయి వీళ్ళ నోళ్ళలో;
అర్థం లేని శబ్దాలు
అంబువు లేని శ్వేతాబ్దాలు

# సిగలో మందారం

సిగలో మందారం చెక్కుకుని
అగుపించిన మగువను చూస్తే
నీలాకాశంలో నిగనిగలాడే
బాల భాస్కర బింబం గుర్తొస్తుంది

పీతాంబరాలు కోరని ఆమెకు
శ్వేతాంబరం ఎంతో సొగసునిస్తుంది.

ఉషా బాలామణి నిదురలేచి
నిశాద్వార కవాటాలు తెరుచుకుని
నింగి ముంగిటిలో కాలూని
తొంగి చూస్తున్నట్లనిపిస్తుంది

శ్రీరామసాగర జలలాతో
చిగురులెత్తిన పొలాలలో
గట్లమీద నడిచే పట్నవాసపు పిల్ల
చెట్లమీదే చూపునిగిడ్చింది

పట్నాల్లో జన సమ్మర్దం
జనంతోపాటు ధన సమ్మర్దం
పల్లెకు వెళ్ళమంటే వెళ్ళరు
వాళ్ళు బాగుండాలని కూడా తలచరు

ఆమె క్రొత్తగా వైద్య విద్యలో
అయింది ప్రవీణురాలు ;
వెళ్ళమన్నారు పల్లెకు
పేదల సేవచేయ మన్నారు

రోడ్లు లేవు కార్లు లేవు
రోమియోలు లేరు పల్లెలో ;
ఎంత హాయిగా వుంది గ్రామసీమ !
స్వాంతం నిండా విప్పారిన ప్రేమ !

పట్టుమని పాతికేండ్లు లేని పడుచు
పట్టా తీసుకుంది వైద్య విద్యలో

నగరం మీద మోజుపడే
నాజూకు వనితలంతా
పల్లెకు వెళ్ళిపోతున్న పిల్లనుచూసి
గొల్లున నవ్వారు ; అదో వింత !

కుటీరంలో నివాసం !
కుచేలులతో సావాసం !

అశ్వనీ దేవతలా వున్న
ఆమెను చూచిన పల్లీయులు
అకస్మాత్తుగా ఆకాశంనుంచి
అవనికి దిగిన దేవత అనుకున్నారు.

ఆత్మీయత, అభిమానం
అనురాగం, అనుబంధం
ఆమెనుండి నేర్చుకోవాలి.
ఆనందం పెంచుకోవాలి

తాను నివసించే కుటీరం వెనుక
తనంతట తానుగా మొలిచింది
అందాల మందార వల్లరి——
అది కలిగించింది మనసులో అల్లరి

తనపేరు మందార మని
ధరణికీ తెలుసును కాబోలు !
అందుకే తనకు కానుకగా
అందించింది మందారాన్ని ;
పచ్చని ఆకుల నడుమగా
వెచ్చని అరుణ మందార మంజరి ;

తనపేరు ఎవ్వరడిగినా
తానుగా చెప్పనే చెప్పదామె!
పెరటిలోని మందారం వద్దకుతీసికెళ్ళి
"పేరు తెలుసుకోండి !" అంటుంది

"నీ పేరు మందార మంజరి
నీ ఊరు సౌభాగ్య నగరి"
అన్నాను ఒకనాడు ఆమెతో;
ఆశ్చర్యపడి పోయింది ఎందుకో ?

నాలుగు మందారాలు జతచేసి
నా చేతికి అందించింది తానుకగా:
"రవి కాంచలేనిది వుంది
కవి కాంచలేని దేముంది?"
అంది ఆమె అనురాగంతో
మందారాలంకృత ధమ్మిల్లంతో

మందార మంజరి నుండి
మగువలేకాదు మానవులంతా
తెలుసుకోవలసింది ఒకటుంది
"దేశం పల్లెల్లోనే వుంది"

# బాలహృదయం

క్షీర సాగరంలో
చిన్ని వట పత్రంలో
శ్రీ మహావిష్ణువు
చిన్నారి బాలుడు

పండరిలోని విఠలుడు
పదివేల సంవత్సరాలు గడచినా
అయిదేండ్ల పిచ్చికొయ్య
అన్నాడు తెనాలి రామకృష్ణయ్య

భగవంతుడికి సర్వదా
పసివాడుగా వుండడం ఇష్టంకాదా !
అందుకు కారణం యేముంది ?
అతని మనస్సు నిర్మలంగా వుంటుంది

ప్రతి మనిషీ బాల హృదయంతో
ప్రతిభాసిస్తే ఎంత బాగుండును !
యుద్ధాలు, మారణహోమాలు
ఇద్ధరణిని లేకుండా పోవును !

అంతర్జాతీయ బాల వత్సరంలో
అంతా బాల హృదయులు కాగలిగితే
ఈ యేడైనా ప్రపంచం బాగుంటుంది
ఎంతో ఆనందంగా వుంటుంది.

# మంటల జేగంటలు

పల్లెలో పుట్టాను
పట్నంలో పెరిగాను
పల్లెను మరవరాదన్న మహాత్ముని మాటను
వల్లె వేస్తూనే వున్నాను

పల్లెలోని వారు పామరులూ కారు
పట్నాల్లోనివారు పండితులూ కారు ;
పల్లె తల్లి - పట్నం పిల్ల
తల్లిపిల్ల బంధం తెగడం కల్ల

పట్నాలను పెంచుతూ పోవద్దు
పల్లెల్ని తుంచుతూ రావద్దు
భారత జనని పల్లెలో నివసించి
పట్నాల ప్రజలను దీవిస్తుంది

సంక్రాంతిలోని క్రాంతి
సమతా వాది కవికి సంభ్రాంతి ;
ఈ క్రాంతి పల్లెలో, పట్నంలో
ఎల్ల యెడల పంటలా పండాలి

పంటలు ప్రతి పొలంలో పండాలి
మంటలా ప్రతి మనసులో మండాలి
ప్రజల ఆకలి కడుపులు నిండాలి
భారతి హృదయం వెచ్చగా వుండాలి

అశేష ప్రజా హృదయాల ఆలయాలలో
అవిగో! మంటల జేగంటలు!!
చలి నెదిరించడానికి చెలీ, గొంగళీ;
సంక్రాంతి వెలిగించె చక్కని జ్వాలావళి!

# శాశ్వతాలు

పూల కొమ్మ చెయ్యెత్తి
'చాలా వుండాలి లోకం' అంది ;
చేయి ఎత్తలేని రాతిబొమ్మ
చిరునవ్వుతో ఉండిపోయింది

గాలికి – పూలకొమ్మ తుళ్ళింది
కమ్మని పరిమళాలను చల్లింది ;
వసంత కాలం వచ్చిపోగానే
వాడి వత్తలై పళ్ళింది

వేల యేండ్లనాడు శిల్పి
వ్రేళ్ళు చెక్కిన రాతి బొమ్మ
సౌందర్య సుగంధాలను
శాశ్వతంగా చిందిస్తున్నది

# ఆ శా జీ వి

ప్రతి మామిడి పూయదు
ప్రతి కోయిలా కూయదు
ప్రతి లేఖినీ వ్రాయదు
అయినా వస్తుంది నవ వర్షం

నాకు కావలసింది నవవర్షం
నేను కోరుకునేది జనహర్షం
నాకు ఉత్తేజం కలిగించేది భవిష్యం
అందుకే వర్తమానాన్ని ఆదరిస్తాను

సుగంధ వాయువులు కావ్యాల్లో ;
దుర్గంధ పవనాలు పట్నాల్లో ;
ప్రణయాలు భావకవుల హృదయాల్లో ;
ప్రళయాలు ప్రపంచ ప్రజల నయనాల్లో !

నేను చేదు వేప పువ్వు మ్రింగగలను
నేటి విషమయ ప్రపంచంతో ఉండగలను ;
ఇదంతా ఇష్టంవుండి కాదు సుమా ;
భవిష్యత్తు బాగుంటుందని నమ్మగలను

# జ్ఞాపకాల రూపకాలు

జ్ఞాపకాల రూపకాలు !
ఒకటి చంపకం ! ఒకటి కంటకం !
ఒకటి సుఖాంతం ! ఒకటి దురంతం !
ఒకటి రేయెండ ! ఒకటి మండు టెండ !

ఈ జ్ఞాపకాల రూపకాలను
ఇరుకైన మనో రంగస్థలం మీద చూస్తూ
పులకిస్తూ, ఉలిక్కిపడుతూ
పూటలు గడిపేస్తుంటాను

వద్దని ఎంత మనసు మార్చుకున్నా
వద్ద చేరి కవ్విస్తాయి జ్ఞాపకాలు ;
గతాన్ని వదిలించుకోడం సులభం కావంటాయి
మతిమరుపు మనిషే అదృష్టవంతుడంటాయి

కారాగృహంలో అడుగుపెట్టే ముందు
కంట తడి పెట్టుకుంటూ వెంట వచ్చి
మరలి వచ్చే దాకా నిరీక్షిస్తానని
మాట ఇచ్చిన ముద్దరాలి ముఖం !

స్వతంత్రుడిగా తిరిగి వచ్చిననాడు
పరకీయయై, పరతంత్రయై
ముఖం చూపడానికి వెనుకాడే రూపం
మూడు దశాబ్దాలైనా వెన్నాడుతుంది, పాపం!

తాగి దేవుడికి టెలిఫోన్ చేసే
వాగుబోతు, తానే సవాళ్ళు వేస్తాడు
తానే దేవుడి తరఫున జవాబులు చెబుతాడు;
అలాగే నా జ్ఞాపకాలకు నేనే రూపకాలు అల్లుకుంటున్నాను

# జ్ఞాపకాల రూపకాలు

జ్ఞాపకాల రూపకాలు !
ఒకటి చంపకం ! ఒకటి కంటకం !
ఒకటి సుఖాంతం ! ఒకటి దురంతం !
ఒకటి రేయెండ ! ఒకటి మండు టెండ !

ఈ జ్ఞాపకాల రూపకాలను
ఇరుకైన మనో రంగస్థలం మీద చూస్తూ
పులకిస్తూ, ఉలిక్కిపడుతూ
పూటలు గడిపేస్తుంటాను

వద్దని ఎంత మనసు మార్చుకున్నా
వద్ద చేరి కవ్విస్తాయి జ్ఞాపకాలు ;
గతాన్ని వదిలించుకోడం సులభం కాదంటాయి
మతిమరుపు మనిషే అదృష్టవంతుడంటాయి

కారాగృహంలో అడుగుపెట్టే ముందు
కంట తడి పెట్టుకుంటూ వెంట వచ్చి
మరలి వచ్చే దాకా నిరీక్షిస్తానని
మాట ఇచ్చిన ముద్దరాలి ముఖం !

స్వతంత్రుడిగా తిరిగి వచ్చిననాడు
పరకీయమై, పరతంత్రమై
ముఖం చూపడానికి వెనుకాడే రూపం
మూడు దశాబ్దాలైనా వెన్నాడుతుంది, పాపం !

తాగి దేవుడికి టెలిఫోన్ చేసే
వాగుబోతు, తానే సవాళ్ళు వేస్తాడు
తానే దేవుడి తరఫున జవాబులు చెబుతాడు;
అలాగే నా జ్ఞాపకాలకు నేనే రూపకాలు అల్లుకుంటున్నాను

# ఆదిత్యుడు - అద్దం

అలెగ్జాండరుకు అదృష్ట దేవత
అపురూపమైన అద్దం ఇచ్చింది ;
అక్బరు చక్రవర్తికి అదే దేవత
ఆదిత్యుణ్ణి అందించింది

అద్దంలో తన ముఖం మాత్రమే
అవలోకించ గలిగాడు అలెగ్జాండరు ;
ఆదిత్యునిలో ఆ దేవదేవుణ్ణి
అవలోకించ గలిగాడు అక్బరు

పార్సీ మూలం : ఫాయదీ

# అ. ఆ. ల మధ్య మనిషి

నక్షత్రాలను తన
నాల్కతో నాకేస్తూ
దవడల్తో నమిలేస్తూ
నడిచిపోతున్న దయ్యంలా
నల్లటి చీకటి, లోకంలో!

మంచు కప్పిన శిఖరాలు
మండుతున్న కాగడాలుగా
చీకటి ఆకాశంలోకి—కళ్ళు
చించుకుని చూస్తోంది ప్రకృతి

కత్తి అంచుమీద గంతులేస్తూ
నెత్తురు మడుగులో నాట్యం చేస్తూ
జేగంటల సవ్వడిలో
జనావళి సందడిలో
గొర్రెల్ని కోసేస్తూ
బర్రెల్ని బలిచేస్తూ
జాతర జరుపుతున్నారు
పాతర తవ్వుతున్నారు

అజ్ఞానం, చీకటిలా, వె
న్నంటి తిరుగుతున్నది;
చీకటి పొదరిళ్లలో
చీరలు చిరుగుతున్నాయి;
మౌన నయనాల చాటున
మాన హరణాల కథలున్నాయి

అడవి కాపలా జవానులకు 'మందు' పోసి
అందమైన జింకల్ని తెగేసి
బిర్యానీ, పులావ్ వండుతున్నారు
బీరూ, సారా యేరులు పారిస్తున్నారు
ఈ అనాగరిక జనారణ్యంలో
ఎక్కడ నాగరకత వుందో పరిశోధించాలి

బర్బర ప్రవర్తనలో
దుర్బలులకు తోడులేదు, తావులేదు;
అర్ధం, అధికారం. ఆసవం. అడది——
అ, ఆ. ల వద్దనే వున్నాడు మనిషి ఇంకా

# హిమ డమరు

హిమ డమరువు మ్రోగుతున్నది
ఇలాతలం ఊగుతున్నది
నవవత్సర మహాశివుని
నాట్యం కొనసాగుతున్నది

చిరుగంటలు పలికించెను శివాలయం
శీత శిలలు కురిపించెను హిమాలయం
శివుని కేశపాశమైన ఆకాశం
శుభ గంగా సుధాఝరీ సురాలయం

మంచు ముసుగు వేసుకొనెను మగువ ధరణి;
మగువమోము చంద్రాయితమైన తరణి;
తరణిని తరుణిగ మార్చిన ఈ హేమంతం
ధరాతలికి చూపింది నూతన సరణి

హిమపారావత ఖగాలు ఎగసినవి
సమరానల మహోష్ణతలు ముగిసినవి;
దుప్పటి, సంపటి లేని పేదవానికి
నిప్పులాంటి చెలి పెదవులు దొరికినవి

కారుణ్యపు తెలిజెండా ఎగిరించండి;
తారుణ్యపు భోగిమంట వెలిగించండి
మదనుడు చెలరేగిన హేమంత ఋతువులో
యోగి, భోగి అను తేడా తొలగించండి

# దోషి - నిర్దోషి

ఒకడు చేసిన నేరానికి
ఒకడు వెళ్లాడు కారాగారానికి;

ఒకడు చెప్పాడు దొంగ సాక్ష్యం
ఒకణ్ణి హింసించడమే అతని లక్ష్యం !

న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు
అతనికి కలిగించలేదు నిట్టూర్పు

దోషి వీధిలో తిరుగుతున్నాడు
నిర్దోషి కైదులో మురుగుతున్నాడు !

# రజతోత్సవ రథయాత్ర

అదిగదిగో నవాంబరం*
ఆంధ్రావని సంబరం;
ఇరువది యైదేండ్ల పండుగ
ఏ తెంచిన శుభదినం

పాతికేండ్ల ఏకత్వం
జాతిని బలపరిచింది.
ప్రాంతీయ విభేదాల
బాధలు తొలగించింది.

తెలుగు నేల ఒక్కటని
తెలుగుజాతి ఒక్కటని
మరల మరల చాటండి
మనమంతా ఒక్కటని.

రజతోత్సవ రథమదిగో
ప్రజల వెంటవస్తున్నది
రథము మీది తెలుగుతల్లి
ప్రజలను దీవిస్తున్నది.

---

* నవంబరు

కర్షక, కార్మిక, కవిజన
హర్షాంచిత రజతోత్సవ
వర్షంలో ఆరుకోట్ల
ప్రజలు కలిసి నడవాలి

తెలుగు పతాకం చేకొని
తిరగండి ఊరూర
ఇంటింటా తెలుగు దివ్వె
ఇపుడే వెలిగించండి

ఈ దీపావళి దిశాళి
ఏడంతా వెలుగుతుంది
ఈ గీతావళి జనాళి
ఏడంతా పాడుతుంది

ఆంధ్రమాత పుత్రులారా !
అనురాగ పవిత్రులారా !
అందరికీ మిత్రులారా !
అంధకార శత్రులార !

అన్నపూర్ణ తెలుగుభూమి
అన్నమాట మరువకండి ;
ఐక్యంగా శ్రమించండి
ఆ కీర్తిని నిలపండి.

# మలేషియాలో మనవాడు

మలేషియాలో మనవాడు
మహాశక్తిగల మొనగాడు
ఆ దేశానికి వెళ్ళాడు
స్వేద వర్షమును కురిసేడు

కేదారాలను పండించాడు
గాదెలనెన్నో నింపించాడు
రబ్బరు తోటలు, కొబ్బరి తోటలు
అబ్బబ్బో! తైల తరు వనాలు

కూర్చినవాడు ఆంధ్ర వీరుడు
మలే 'బహాసా'లో కనిపించే
మధుర గీర్వాణ అరబీ మాటలు
నేర్చినవాడు ఆంధ్ర తనయుడు

లక్షా యాభై వేల జనావళి
కక్షలు తెలియని తెలుగు జనావళి
అందరి మన్నన పొందినవారు
నందన వనమున నుండినవారు

తెలుగంటే తమ మాతృమూర్తిగా
తెలుగంటే తమ జాతి కీర్తిగా
తెలుగంటే తమ కంటి వెలుగుగా
తలచే సోదరులట ఉన్నారు

రంబుటానువలె తియ్యని తెలుగు
మ్యాంగోస్టీన్‌వలె కమ్మని తెలుగు
డోరియాను వలె వెచ్చని తెలుగు
నోరారా మాట్లాడేవారు

కోలాలంపూర్ మహానగరమున
నీలాకాశంతో ముద్దాడే
ఆంధ్ర భవనమును నిర్మించాలని
ఆరాటంతో ఉన్నారు

మూడువేల మైళ్ళావల ఉన్నా
ఓడ, విమానం ప్రయాణమైనా
గుండె గుండెకూ దూరం లేదని
నిండు మనసుతో అంటున్నారు.

మలేషిలో ఆంధ్ర సోదరులు
మనను మరువ లేమన్నారు.
మనసుకన్న మన ఆంధ్ర మాతకు
ఋణపడి ఉన్నామన్నారు

ఇష్టంతో కష్టించేవారు
ముష్టికి చేతులు సాచనివారు
ఆత్మాభిమాన ముండినవారు
ఆంధ్రత్వంతో నిండినవారు

---

* మలేషియా ఫలాలు

## మలేషియాలో మనవాడు

బొమ్మల్లాంటి చైనా కొమ్మలు
గుమ్మం ముందర కనిపిస్తారు
కనుబొమ్మలతో అమ్ములు చిమ్ముచు
మనసు దొంగిలిస్తుంటారు.

మలేపిల్లలు, భలే పిల్లలు
మమతలు పంచేస్తుంటారు
పొంగిన వక్షః ప్రదర్శనంతో
లొంగ దీసుకుంటుంటారు

పురాణాలలో నందనవనము
భువి మలేషియా సుందర తరము ;-
ఆ నందనమున ఆంధ్ర పతాకం
అందర మొకపై ఎగరేతాం

రమ్మని పిలిచిన అక్కడి జనతకు
పొమ్మని పంపిన ఇక్కడి ప్రభుతకు
కృతజ్ఞతాంజలి ఘటించుతున్నా
క్రొత్త కవనమును రచించుతున్నా

# దీపికా గీతిక

ఇటు పొమ్మంటా డొకడు
అటు పొమ్మంటా డొకడు
నీ మాటను ఎవ్వడు వినడు
నీ దారిని నువ్వు పో : తమ్ముడూ !

ఒకరి వేదనను ఒకరు తెలుసుకునే
ఉత్తమ గుణమిపు డెక్కడ వుంది ?
నీ బాధను నువ్వు పడుతూవుండు !
నీ గాథను కావ్యంగా వండు !

జనారణ్యమీ మహానగరము——
పలుకరించుటకు సమయం లేదు;
ఉరుకూ పరుగూ అంటే బ్రతుకు
అలా లేనిది దొరకదు మెతుకు

పిచ్చి కళలతో కాలం గడిపే
వెర్రి లోకానికి కళలెందుకని ?
బొమ్మలు గీస్తే చూసేదెవరు ?
కమ్మలు వ్రాస్తే చదివేదెవరు ?

ఈ మహాటవీ మధ్యంలోను
ఈ మహాంధకార గర్భంలోను
గుమగుమలాడే పువ్వు ఉండదా ?
మిలమిలలాడే దివ్వె ఉండదా ?

ఆ పువ్వే నా నందనవని
ఆ దివ్వే నా దీపావళి

# ధ్వజమెత్తిన ప్రజ

గత కలహాల మీద
గతం సలహాల మీద
కాంతిని కనపడనివ్వని గాఢాంధకారాల మీద
శాంతిని వినపడనివ్వని రణ ఘీంకారాల మీద
ధ్వజమెత్తిన ప్రజ
ఆ ప్రజ నిజమైన ప్రజ

భారతికి హారతి పట్టనివ్వని వారి మీద
స్వాతంత్ర్యాన్ని పారతంత్ర్యంగా మార్చగోరే వారి మీద
దారిద్ర్యరేఖను తుడిచివేయనివ్వని ధనస్వామ్యం మీద
ధరల ఉదజని బుడగను 'ధర'కు రానివ్వని ఆర్థిక వ్యవస్థ మీద
ధ్వజమెత్తిన ప్రజ
ఆ ప్రజ నిజమైన ప్రజ

మూఢవిశ్వాసాల మేడల్లో వసించి
గాఢంగా భక్తావళిని కరుణించినట్లు నటించి
అజ్ఞానం అనే అమూల్యవరాల్ని విక్రయించి
ఆర్జన చేసుకునే అధమశ్రేణి ముని వర్యుల మీద
ద్వజమెత్తిన ప్రజ
ఆ ప్రజ నిజమైన ప్రజ

కులం బలాన్ని కలం బలంగా భావించి
కిలం పట్టిన భావాలను కళగా చిత్రించి
కృతజ్ఞతాభావాన్ని వెన్నుపోటుగా పరివర్తించి
హింసా రిరంసతో జీవించే హీనులమీద

ధ్వజమెత్తిన ప్రజ
ఆ ప్రజ నిజమైన ప్రజ

ధన, పదవీ, కీర్తి దాహాల మీద
పరదేశ, భాషా, వేష వ్యామోహాల మీద
నగ్నతా ప్రదర్శనాభిలాషి దేహాల మీద
సమాధానాలు లేని చచ్చు సందేహాలమీద

ధ్వజమెత్తిన ప్రజ
ఆ ప్రజ నిజమైన ప్రజ